ంశము గేహము జన్మము పావన మాయెగదా॥ సాకేత ॥భూపాల
ః రేపే ముహూర్తము రూపించియున్నారుగా విబుధులు! లోప
లేవుగా! ॥సాకేత॥ ధారుణి దాళ్వారి నారాయణాఖ్యా ధారుడె
గుండధాముడు శ్రీరాము డౌ నిజము॥ సాకేత।

క. జనకుడు పలికిన వాక్యము లనూ విని
దశరథుఁడు గడుఁ జెలంగుచు, దన నె
మ్మనమున సంతోషించుచు
వినయముతో సభ్యులెల్ల వినఁగాననియెః

దశ. కీర్తన-బేహాగ్: అటతాళము

మిథిలాధినాథా, విను, నాదుపలుకులు॥ మి॥ పృథివిని నాకుఁ
మగు నీసరి వియ్య మెన్నటికిని జిక్కదు; నాదుపలుకులు॥ మి
సుమిత్రా నందనునకు నీయూర్మిళాదేవి నీయుము; నాదుపల్కులు
ంరుదుగ నీసోదరుని కుమార్తెల భరత శత్రుఘ్నుల కీయుము;
లుకులు॥ మి॥ అక్షయశుభము లీక్షితి నిచ్చు మోక్షగుండే
మునకును నాదుపలుకులు॥ మి॥

వ. అనిన,

తోహ. మంచిది మీసమ్మతమే మాసమ్మత మని జనకుడు
నంచితముగ సభయందునున్న వారనిరి తథాస్తని కడక ॥రామ॥

వ. అంత జనకుండు సని పురాలంకారము మొదలుగాగల వివా
ష్టములోనుండె. అప్పుడు విశ్వామిత్రుండు రామ లక్ష్మణులఁ
ం దశరథుని బసకువచ్చినఁ నమ్మహీపతి యెదురుగఁజని పూజించి
చ్చి కనకపీఠంబుపై వసియింపంజేసిన, దీవించి మౌనిం యిట్లనియెః

--విశ్వా-కీర్తన-రూపకము.

మంగళమగు మంగళమగు మంగళమగు రాజా! పొంగుచు
స్వరము బొందెద వినతేజ ॥ మంగళ॥ నీకొడుకులు నాకార్యము

నెఱవేర్చిరిరాజా ! యేకొఱతలు లేకుండిరి, నాకడ మహారాజా ! మంగళ॥ కొడుకులగై కొని, శుభములు, వడయుముమహారాజా! కడువడి మోతుగుండేశుని కరుణను మహారాజా ॥మంగళ॥

సం-తోహ: అని తెలిపెడు తఱిఁ దనతనయులు మొక్కి-న ముదమున దీవించి, ఘనముగ కౌఁగిట జొనిపి దశరథుం డనియెను మానినిగాంచి ॥రామ॥

దళ-కీర్తన శంకరాభరణము, ఆదితాళము.

తాపసేంద్ర, దయారసము దోప మీరు చూడఁగ నాపుత్రుల కెన్నటికి లోపము లుండవుగా ! ॥తాప॥ మీసేవ చేయుట చేత మేటి గుణములందును భాసురముగ ప్రబలుచు పరగిరి వీ రెందును ॥తాప॥ దీక్ష నారాయణకవిని రక్షించుచుండెడు మోతుగుండవిభునకును మ్రొక్కి- కొలుచుచుండెను ॥తాప॥

వ. ఇట్లు ప్రశంసించుచున్న తఱి శతానందుండు దశరథమహారాజు దర్శనార్థమై వచ్చిన, వారికి దగిన మర్యాద నిలిపి పీఠంబొసంగి కూరుచుండఁజేసి పూజించి ప్రస్తావవశంబునదశరథుం డిట్లనియడిగె:

క. జనకునకుఁ బురోహితుఁ డవు;
ఘనుడ; వహల్యాత్మజుఁడవు; గావున, సర్వం
బును వేద్యం బగు నీకును;
వినిపింపగ దగును సీత వృత్తాంతంబుల్.

వ. ఈసీత జనకక్ష్మాపతియౌరసపుత్రికయా? దత్తపుత్రికయా? అటులయిన నామెను గనిన తబిదండ్రు లెవరు? వివరింపవే, మునివరా, యని వేఁడిన, శతానందుండు:

శతా - కీర్తన - త్రిశ్రిజాతి.

విన్నవించెద వినుము వీనులలర ॥విన్న॥ నన్ను దెలుపు మని, యున్న జనక సుతపూర్వచరిత ॥విన్న॥ మునుపద్మాత్ముఁడను జనపాలు

పద్మాక్ష — కీర్తన — కన్నడ : అటతాళము.

కన్యకైన సుగుణకాంతుడెవ్వాడో! యీ॥క॥ ధన్యుడైనట్టి రాజన్యుం డెవ్వడున్నాడో! ॥క॥ రూపవయోగుణ సంపన్నతలను లోపములు లేక లోకములో మన ॥కన్యకైన॥ నరులలోపల విద్యాధరులలో బన్నగ వరులలో మఱియు ఖేచరులలో గాంచిన ॥క॥ మోతుగుండప్రభు వత్యుత్కృపా కటాక్షము చే నిచ్చినట్టినా నెయ్యంపు ॥కన్యకైన॥

వ. అని యోజించి, యనంతరంబ స్వయంవరంబు చాటించె. అప్పుడు—

చ. నరులును ఖేచరుల్ సురలు నాగులు యక్షులు సిద్ధచారణుల్
గరుడులు రావణాద్యసురకాంతులు మానులు వాగ్మలున్ గిరుల్
దరువులు కామరూపములు దాల్చి మహావిభవంబుతో స్వయం
వరమును జూచుకోరికను వచ్చిరి తన్నగరంబుఁ జేరఁగన్.

వ. ఇట్లు వచ్చిన వారందరు విన,

తే. రహిని నాకాశనీలవర్ణంబు రీతి
నెవనితనుకాంతి వెలయునో, యవని నతని
కీ శుభాంగిని నిచ్చినే నిపుడు పెండ్లి
చేయ బూనితి నని వల్కె క్షితివిభుండు.

వ. పద్మాక్షుని వాక్యంబున కందఱు కుపితులై యిట్లనుకొనిరి:

రాజులకీర్తన—కన్నడ: రూపకము.

బలుమోసకాడుగాడె యీతడు! బలు॥ వేడు నానకొల్పి మనలను రాఁ జేసి యిటుల భాషించెడు! ॥బలుమోస॥ ఈ కన్నెచక్కదనము ఏ కన్నె లందుగనము! చేకొన్న వాని భాగ్య మది యెన్న నలవిగాకుండును ॥బలుమో॥ ఆచంద్రమైన రూపు, మన యందు నెవరి కొద్దవు! భువియందు మోతుగుండ విభునందు నుండఁ గాఁ జెల్లును ॥బలుమోస॥

వ. స్వయంవరమని పిలిపించి వంచించి యెందునులేని యొద్ద
కన్నియున్నవాఁడు. ఇన్నరాధమునిఁ గదనంబున వధియించి యీ
కను గైకొందమని యెంచి యందరును, యుద్ధాభిముఖులయిన
పద్మాక్షుండు—

తోహర : వారల నెల్లను వాడి శరంబుల వైచుచు బోరాడ
గూరతఁ బోవిడి సురలు మానవులు సుక్కి యనలఁ జనగాను ॥ రా॥

వ. పద్మాక్షుండు విజృంభించి తఱుముచుండిన సహింపనోపక దాన
వమాత్రము వెనుదీయక పోరాడి,

మత్తకోకిల.

అక్షయంబుగ బాణముల్ గొని యాతనిన్ వడివైచి, రూ
క్షేక్షణంబులఁ జూచుచుం దగ నేపుమాపిన, సుక్కి ప
ద్మాక్షుఁ డాహవభూమిఁ గూలిన నందఱున్ జెలిఁ గైకొనన్
ఆక్షణంబున రాఁగ దాఁచెను నామె దేహము వహ్నిలోన్.

వ. ఇట్లగ్నియందు దాఁగి కనబడకుండిన నా కన్నియను వెదకి
నా పురంబంతయు గాల్చి శ్మశాన తుల్యంబుఁ జేసి యందరు
ఖం జనిరి. లక్ష్మీకామతత్పరుండై పద్మాక్షుండిట్టి దశ ననుభవించె,

క. వరియింపరు లక్ష్మిని ధీ
వరు లెన్నఁడును నెమ్మనమున భయ శోకంబుల్
మరణముఁ జిత్తచలనమును
సిరిఁ బొందిన వారికెపుడుఁ జేకురు ననుచున్.

వ. అంత నతని పత్నులు వేయిమంది సహగమనం బొనర్చిరి.
బహుకాలంబునకు దశకంఠుండు విమానారూఢుండై దిగ్విజ
యరగువాఁడా మార్గంబునవచ్చిన—

తోహర: అనలకుండ బాహ్యప్రదేశమున నాపద్మ చరింపగను,
గను డా, కన్యను దశకంఠున కటుజూపఁగఁ గనెను.

వ. ఇట్లు గాంచి యతఁడు మోహంబుచే విమానంబు గ్రిందికి బఱపుచు,

రాగ—కీర్తన. పూరికల్యాణి: అటతాళము.

ఉం డుండవె యోచెలి ॥యుం॥ దండిమగండ ప్రబలుండ దయ నిండారగ ॥నుం॥ లోకు లనేకులు నీకొఱకై గద యీకడ నీకొఱకుగ దాకి మును వే కూలిరి ॥యుండు॥ అప్పుడు దప్పిన, విప్పుడు దప్పని! యొప్పులకుప్ప ముదమొప్ప నను మెప్పుజేయు ॥నుం॥ రాక్షసరాజను రావణనాముడ: నీక్షితి మోతుగుండాధ్యక్షువరసాక్షి యాగు ॥నుం॥

వ. అని పలుకుచు డాయం జనిన, నామె మరల నగ్నికుండం బునం బ్రవేశించినఁ, గోపించి,—

రా॥ తోహార: బహుజనమును బాధించెను దా దహనుని లోపలఁజేరి, యహాహా! యిప్పుడు నటులనే జేసెను నతివ కను చమ త్కారి ॥రామ॥

వ. అయిన నీరహస్యంబుఁ దెలిసితిగదా! ఇఁకను సాధించెద నని యెంచి,

సీ. అంతట రావణుం డాయగ్నికుండంబు
జల్లార్చి చూచిన, నరగ నందు:
బంచరత్నంబులేర్పడఁ గనుపట్టిన,
నవి పెట్టెలోఁ దాఁచి, యది విమాన
మున నుంచికొని పురమున కేగుదెంచి
తత్పేటిక దేవమందిరమునందు
నునిచి, యారాత్రి మందోదరితో
ననె 'భామిని, నే రత్నపంచకంబు

తే. నీకునై తెచ్చి, దేవమందిరమునందు
బెట్టినా'నన, నామె యాపెట్టెకడకుఁ

జేరి యొత్తుగం జాలక సిగ్గునొంది
భర్తతోఁ దెల్ప నద్భుతపడుచు; నతఁడు.

వ. ఆ మందిరంబునకుఁ జని,

సం-శ్లో: కదిలించిన నది కదలకయుండినఁ గడురోషము పెన
గొన్న, నెద మెచ్చుచు నిరువదికరములతో నెత్తిన లేవక యున్న॥ రా॥

వ. అతండు మహాపరాక్రమంబున లాగి మూఁతదీసిన, నందుఁ
గోటిసూర్య ప్రభావిరాజమానస్థమై కన్నుల మిఱుమిట్లు గొలుపుచున్న
కన్నియయున్నఁ, గన్నులారఁ గని మందోదరి-

మందో-కీర్తన-బిలహరి: రూపకము- (ఘోరకపా) వలె.

ఏమి యీ విధము నా మనంబులో సంశయ మగు! ॥ఏమి॥
స్వామి, రత్నము లేవి లే విట! యీ... యెవ్వ రగు! ॥ఏమి॥ మేలు
మే లగు! బాలికామణి నేఁ దెచ్చి తి వేళ నిచ్చట లీల గన్పడెఁ।
జాల దెల్పుము బాలమేటికి! ॥ఏమి॥ కుంకుమ మోముగుండ శ్రీహరి
నారిగాబోలు! నేమి వా గంత భార మాయెనే! తేరిచూడఁగ నేర
రెవ్వాగును॥ ఏమి॥

వ. అని యడిగిన రావణుఁడు పద్మాక్షుభూపాల కులసంభూత
యగు నీమెకోఁటకుఁ బూర్వంబు తనుపడిన పాట్లన్నియు నగ్నికుండం
బునఁ దాఁగిన నామను దాఁ దెచ్చిన విధంబును దెలిపినవిని, మందో
దరి యదరిపడి, ...

మం.శ్లో: స్వకులధ్వంసమునకు నీమను లంకకుఁ దెచ్చితి నగు
నేమి! అకటా! యిది బాలిక యని మెంచకు మాదిశక్తియగు జూమీ!
॥రా॥ నీ వంశంబును నీరు జేయు నిక, గాపున, నిటునిల్పకుము! రావణ,
వనములలో విడిపించిన బోస్తు నదట సత్యమ్ము॥ రా॥

మం-కీర్తన-హిందూస్తాని కాఫీ-రూపకము. (నను మారు) వలె.

మరు మాట తెలుపవలదు వినుము మానవాశనా! పేటికయం దీమె నుంచి పేర్మితోడను నొకచోట భూమి దవ్వి, యందు మాట దగును॥ మరు॥ వరగృహస్థు డయ్యు విషయవాంఛ దవులక, ధరబరగు రాజయోగియింట బెరుగు ముందిక ॥మరు॥ సర్వగుణను మోక్షగుండ స్వామి మయముగ గను నిర్వచారు గీనునందు నిలుచు నింపుగ ॥మరు మా॥

వ. ఎంతమాత్ర మీ సమయమందిచ్చట నుంపవలదని నొక్కి-వక్కాణించిన, భయకంపిత గాత్రుం డయి రావణుండు——

తో: మందసమందా సుందరి నుంచి విమానముపయి నుంచు కొని, మెండైనను ధరయందు బూడ్చి రం డిప్పుడె యని చెప్ప విని॥ రా॥

వ. రాక్షసభటులు సిద్ధపడుచుండ నప్పుడు సర్వంబు విన, నాకన్య యిట్లని యె:

సీ. ఈసారి లంకకు నేతెంచి రావణుఁ
బుత్రమిత్రులతోడ బొలియ గూల్తు;
మూడవసారి నేర్పున వచ్చి పౌండ్రకు
శతకంఠు రావణు సంహరింతు;
నాల్గవసారి మానక వచ్చి మూల
కాసురుఁ డను ఘటకర్ణసుతుని గూల్తు;
నని చెప్ప నాలించి యసురులెల్లనమృత
ప్రాయులైరంతట రావణుండు

గీ. భయము నొందియు, నదియు లోపల నడంచి,
దీని నిప్పుడె పట్టి వధింతు ననుచు,
కత్తి ఝుళిపించి పైకి శీఘ్రమున నుఱుక,
నడ్డమై నిల్చి మయ కన్య యనియె నిట్లు.

వ. ఆపెట్టె నెత్తించుకొని జనకమహారాజు సభకుఁ జేరఁబోయి, ద్విజుండు,

విప్ర—జనక సంవాదము కీర్తన—ఆదితాళము.

వి 'భూమిపాలవరా! ప్రేమను నా మనవిని వినదగు! భూ॥'
రా.'భూమిదేవరా! ధీమతితోఁ దెలుపఁగ దగు నది॥భూ॥'
వి-'తా మొసంగిన భూమి దున్నఁగ నేమొ కాని యిది యొక టగపడె ॥భూ॥'
రా-'ఏమి యున్నను నేమి కర్తలు స్వామి తామే; సంశయ మేటికి॥భూ॥'
వి'-దాన మిడునది ధారుణియకద! యీనిధాన మిడి యుండితివే ॥భూ॥'
రా-'దాన మిచ్చిన ధరణినుండిన, దాని నేను దగఁ గైకొందునె ॥భూ॥'
వి' ఈక్షితికి రాజేంద్రులే యధ్యక్షులౌదు రంతటికిని నిను ॥భూ॥'
రా—'మోతుగుండాధ్యక్షుని పదసాక్షిగను సర్వము తమదే ॥భూ॥'

వ. అని విప్రరాజన్యులు వివాదపడుచుండ సభవా రిట్లనిరి:

తోహర: వలదు వలదు సంవాద మేమిటికి వాకిలి దీసియు గనిన నెలమి బెట్టెలో నేమియున్నదో తెలియుద మందఱమునిన ॥రా॥

వ. మంచి దని భటులచేత మూతఁ దీయింప నంత మేఘవినిర్గత విద్యుల్లతికయుంబోలె బాలికామణి వెడలి వచ్చిన నాశ్చర్యకలితులై సభాసదు లిట్లనిరి:

క. తన తండ్రియైన సాగరు
గనవచ్చిన లక్ష్మిఁబోలెఁ, గన్యామణి చ
య్యనఁ దమ గేహమునఁ జేరెను
మనుపం దగుఁ గూతుఁగాఁగ మనుజాధీశా.

వ. అని పలికిన సభ్యుల పలుకుల కలరి యిలాపతి యయ్యదున కియ్యకొనియె. ద్విజుండును బాలామణిని జనకభూపాలున కర్పించి నిజ గృహంబునకు జనియె; అంత_

వ. మీరు వివాహమందిరమునకు దయచేయుం డని చెప్పి, శతానందుండు వోయె. ఇక్కడ జనకుండు వివాహమునకు సమస్తము సిద్ధముచేయించి వధూవరులను గైసేయుండని యాజ్ఞాపించినం గాంతలు సని రామ లక్ష్మణ భరత శత్రఘ్నులను, సీత యూర్మిళ మాండవి శ్రుతికీర్తులను, వేఱువేఱ నలంకరింపఁ బ్రయత్నించిరి,

మధురగతి రగడ:

పల్లవి: సీతారాములనుఁ గైసేసిరి వేడుకను; పెండ్లికుమారుల బ్రియమున గొందఱు, పెండ్లికూతులను బ్రేమను గొందఱు ముత్తైదువులటు ముదమున బిల్వఁగఁ జిత్తరు చవికెనుఁ జేరిరి చెల్వుగ; పీటల మీఁదను బెంపుగ నుంచియుఁ, బాటలు బాడుచుఁ, బరువము గాంచియు, సంపెఁగనూనెను సరగున బూయుచు, సొంపుగ నలుగుల శోభిలఁ జేయుచు, నను వొందఁగ స్నానము గావించిరి; చెన్నుగఁ దడి యార్చిరి మోదించిరి; వన్నెగలుగు దువ్వలువలఁ గట్టిరి; కన్నుల సొగసుగఁ గాటుకఁ బెట్టిరి; ముద్దులమోముల ముదితలు గూర్మిని దిద్దిరి కస్తురితిలకముఁ బేర్మిని; బరిమళగంధము బాగుగ బూసిరి; పరువడి వరధూపంబులు వేసిరి. సురుచిరసుమముల సరులు ఘటించిరి; వర కంచుకముల వాసి ధరించిరి; నవరత్నాభరణంబులు దాల్చిరి; నవనీరజనమనయనలు గొల్చిరి; మకరికలప్పుడు మమతను వ్రాసిరి; ప్రకట భూషలొప్పగ గైసేసిరి; అంతట జనకుం డందఱుఁ గూడను, సంతోషంబున సభ్యులతోడను, మంగళకరహిత మహిత నాదములు పొంగుచు మ్రోయఁగఁ బొలఁతి ముత్తైదువులు, సేసలుచల్లఁగఁ జెలగు మనములను వాసిమీఱఁగను వరపూజనమును వారకచేసి, వివాహమందిరము వారలఁ దోడ్కొని వచ్చి, సుందరము మీఱఁగ జేర్చి యమేయవిభవముగఁ దీరుగ లగ్నముఁ దెలిసి విభవముగ॥

దరు—కీర్తన—హిందూస్థాని కాఫి : ఆదితాళము. (శ్రీపతి యింతటి వలె)

ఈ విపరీతము లేల దోచెను । సామి ! ॥ఈ॥ భావుక కార్యము లు వడసి యుత్సాహమున బోవ నుత్పాతము లావహిల్లెను గదా ! ॥ఈ॥ గాలియత్యంతముగ గదిరివీవఁగఁబూనె! ధూళి సూర్యుని కాంతి తొలఁగఁ గ్రమ్మెను గదా ! ॥ఈ॥ ధరణిని మోటుగుండవగు కృప రాదాయె! గరితురగాదులకు వెఱపు గలిగెఁ గదా! ॥ఈవిపరీతము॥

వ. అని యడలున నడిగిన దశరథునకు వసిష్ఠుని యిట్లనియె,

వసి. తోహార.

అదలకు ముందు మహాభయ మొక్కటి యావహించి త్వర లోను, అది తొలఁగును; నాపిదప నయోధ్యకు నరుగవచ్చు మేల గును॥ రా॥

వ. అని చెప్పునంతలో—

సీ. తండ్రియానతిని సొదలమోచి తనతల్లి,
కంఠంబు దునిమెనే గణ్యసుతుఁడు
పితృవిరోధిని గార్తవీర్యార్జునుని బట్టి,
ప్రాణముల్ దీసెనే ప్రథితవీరుఁ
డిరువదియొకమాఱు దిరిగి నిర్బాహుజ
మొనరించె నుర్వి నే యుగ్రమూర్తి
కశ్యపునకునిచ్చి కాశ్యపి యనునామ
మొసఁగె నీధరకు నే యసమశూరుఁ,

గీ. డట్టి సిద్ధప్రతిజ్ఞుఁ డథ్యాత్మవిదుఁడు,
పరశురాముండు దివ్యచాపంబు కేలఁ
గ్రాల శ్రీరామచంద్రభూపాలమౌళి
మ్రోల నిలఁబడె ముల్లోకములు వడంక.

వ. ఇట్లు కట్టెదుట నిలిచిన పరశురామునిం గని శ్రీరాముండు కరంబులు ముకుళించి నమస్కరించిన నతం డిట్లనియె:

పర. తోహార: మొక్కిన విడతునె! మును రాజన్యులఁ జెక్కించిన గూల్చితిని! ఇక్కతి యిక సనిసేయుము! నిన్నును జక్కాడెద ధృతిని ॥రా॥

వ. అనిన నవ్వుచు శ్రీరాముం డిట్లనియె:

రాముని మత్తకోకిల.

ధారుణీతలమెల్లఁ గశ్యపునకు దానమిచ్చి వి
ప్రశాంతుఁడవై తపంబును సల్పుచుండుటచే నమ
స్కార పాత్రమనంచుఁ జేసితి గాని నీకు భయంబునన్
జేరి మ్రొక్కినవాఁడగాను: హాసింప నేటికి భూసురా!

వ. అనిన రోషించి పరసురాముం డిట్లనియె:

పర. కీర్తన — రాగము: రూపకము.

ఆహా నే సాహసుండ నౌదు నే సుమా! శ్రీరామ! ॥యాహా॥ హైహయుని సహస్రబాహాస్త్రముల ముఖ్యస్త్రుపులఁ మోహరించి చంపినట్టి సాహసుఁడ నౌదుగాక ॥ యాహా॥ రాముఁడ సనఁగ నే నిల రాజిల్లఁగ, వింతొక రాముఁడ నని వచ్చితివా! రాజవు నిను జోనిత్తునె ॥యాహా॥ త్రిలోకవిభుఁడు శివుఁడు, మోహితుండ నేత నాకు విల్లువిద్దె గఱపె నతని గ్రుంగించి తటా! యాస్యనే॥ యాహా॥

వ. అంతనంత శ్రీమద్రామభద్రుం డిట్లనుచున్నాఁడు:

రామ. కీర్తన — హిందూస్థాని కాఫీ: ఆదితాళము.

నమ్మదిగా వినుభార్గవా॥ నా॥ ఇమ్మహిని నా భుజాసత్వ మిట్టి దానని॥ నమ్మ॥ నేను వినోదముగ లాఁగ గానె విఱిగెఁ; నాకర్ణాంత గానీడమునంత కలదె. యుగ్రపుసిద్దోదండము॥ నమ్మదిగా॥ గోప్పుల పులకింపఁ గోర రక్కసులు; నీ వగ్గు లెన్నియూడిన నీకు చెల్ల

నిన్నోంప॥ నెమ్మి॥ సదయుఁడౌ మోక్షగుండేశు సాక్షి నాకుత్సుకయిది; యదియె నీ గొడ్డలి; యుచిత మైనరీతి జేయుము॥ నెమ్మిని॥

వ. అనువాక్యంబులకు నత్యంతకుపితస్వాంతుండయి జామదగ్న్యు యిట్లనియె,

గీ. నీవు క్షత్రియుఁడవు; నేను విప్రుఁడను;
గర్వ మున్నదటులఁ గాంచఁ బోకు;
నాపరాక్రమంబు నాభుజశక్తియు
నీకుఁ జూపువాఁడ నిశ్చయముగ,

వ. అని పలికి,

పర. కీర్తన. – ఆదితాళము : పోపొమ్ము.

పోనియ్యఁ బోనియ్యరాఘవ! విను॥బోని॥ పూనికతో నిన్నుఁ బట్టి పొంగడంగఁ జేయక నే॥బోని॥ సారహీనమైన విల్లుఁ బూరిపుల్లక రీతి విఱిచి, వీరుఁడ ననుచు విఱ్ఱవీగుచు నేతెంచెదవు! వైరులగు కాల మనవచ్చును నా విల్లు చూడు॥బోని॥ బీరు బలుఁడనయిన నిక్క–నిక్కుక దీని లేకయున్న శ్రీ మోక్షగుండేశ శ్రీరఘురాముఁడని దెలుపు నిన్ను; నాముందర నీ సామర్థ్య మేమి పనికి వచ్చు నింక॥బోని॥

వ. జనకునియింట నీవు విఱిచిన విల్లును, నేధరించిన విల్లును విశ్వకర్మ యేకకాలమందు నిర్మించియున్నాఁడు. అందొకటి త్రిపురాసురహరణ కాలంబునందు హరునకు సురలచే నియ్యఁబడియె. దానిచేఁ ద్రిపుర సంహారణంబొనర్చి తనశక్తిని యీశ్వరుండు వేగముగాను మన్న విష్ణుండు శరాకృతిచే సహాయపడ, శివుండు జయించె నని దేవతలాడిరి. ప్రమథులవల్ల విని శివుండు కోపించి హరిని యుద్ధంబునకు రమ్మనిన, డవ కాండాసనంబు హరికి నిచ్చి దేవతలు పురికొలుప హరిహరులకుఁబోరు ఘోరంబయ్యె. అప్పుడు హరికరనిర్ముక్తశరంబు దాఁగుటచే రునివిల్లు నొచ్చి పేటెత్తిన శివునిబలంబు లోఁబువడియె. అది గని,

అజుఁడ వవ్యయుఁడవుపరుడవు నానందమయుఁడ వాదిమూలకారణుండవు
నిజమాయాగుణయుతముగ సృజియింతువు ప్రజలను; రఘు ॥రామ॥
సంగసహితులయిన వారలు నిను గాంచలేరు; సంగరహితులయిన
ధీరులు రంగుగ దమమనములలోనం గని యానందింతురు ॥రామ॥
మోతుకుగుండపురవిహారకా! నారాయణకవిరక్షక! షడ్భావదూరకా!
మోక్షప్రద! దేహాదుల వీక్షింతువు సాక్షి వగుచు ॥రామ॥

పర. తో: ఆదియందు నే హరిని గూర్చి తప మాచరింపఁగా
నతఁడు, నాదరమున బ్రత్యక్షంబయి యిటు లనుచుఁ బలికెఁ దా
నపుడు ॥రా॥

మచ్ఛిదంశమున మహిని గలిసి నీవు నిచ్చలు హైహయనృపుల,
మెచ్చుకత్రుంచి యమేయశమంబును మెఱయఁ దాల్చు మే నవల ॥రా॥

రాముఁ డనఁగ దశరథకౌసల్యలకీమహిలో నుదయించి, నీమము
తోడుత నీకుదర్శనము నే నొసఁగుదు దయ యుంచి ॥రా॥

అని పలికిన నాహరివే నీవై యవతరించి తని వేడి, చనియె.
మహేంద్రాచలమున కాతని యనుమతిఁ గొని కొనియాడి ॥రా॥

వ. ఇట్లు పలికి పరశురాముండు చనినపిదప రాముండు, భయ
భ్రాంతచిత్తుఁడై యున్న దశరథునకు నమస్కరించిన, నాతఁడు కొడు
కును గౌగిలించుకొని దీవించి యిట్లనియె:

దశ-కీర్తన-పున్నాగవరాళి: ఏకతాళము.

నాపుత్రరత్నమా! నాపెన్నిధానమా! ముద్దులయ్య! ॥నాపుత్ర॥
నానోముఫలమా! నాపాలిభాగ్యమా! చిన్నితండ్రి! ॥నాపుత్ర॥
నిను వేగ గంటిని; నేఁగీర్తిగొంటిని; లోప మేమి ॥నాపుత్ర॥
వరమోతుకుగుండపుర మేలుపుండరీకనయన! ॥నాపుత్ర॥

సం. తో: అని యిటు పలుకుచు నందఱు గామిగా నరిగి యోధ్యను దరిసి, ఘనముగ బారులు, గని ముదమొందగ జనిరిఁ 'ముల బొరసి ॥రామ॥

వ. తదనంతరంబున భానుమంతుండుఁ గోసలుఁడు లోనుగాఁగల రెనమండ్రు శ్రీరాముని మేనమామలు తమతమ స్వదేశంబులు ంచుచు రాముని పాణిగ్రహణమహోత్సవమునకు రానలసినదని ఘుండు శుభలేఖ లంపఁగా వారివారి మనంబులలో వారు వా రి కొనిరి:

తో: రామార్పణముగ రయమున గాంచిన నాముద్దుల ను, ప్రేమ మీఱఁగ వరింపక సీతను బెండ్లి యగుట యెట్లిలను॥రా

వ. అయిన దీని విచారింపవలసిన దని ప్రతివారును యోజించి ంశా విమలజ్ఞాన క్రియాయోగాదినామంబులచే నలరాను తను కూ ్రి నూటయిరువది యెనిమిదిమందిని దోడుకొని యయోధ్యకు దశరథాదులరాక వేచియుండి, వారు గృహప్రవేశమునకు వచ్చు యమున—

క. తనయాయుతముగ రామునిఁ
గన వచ్చిన మేనమామ గారికిఁ బ్రియవం
దనము లొనరించి యుచితా
సనములఁ గూర్చుండఁ జేయ సంతోషమునన్.

వ. ఆసీనులయి యి ట్లనుచున్నారు:

మేనమా—కళ్యాణి: రూపకము.

శ్రీకరముగ భానువంశశేఖర ! వినుమా ! యీకన్యలఁ గై కొని రిపుము భరియింపుము నీవు ॥శ్రీకరముగ॥

నీ కర్పితముగను గంటిమి కావున దగను, రాకొమరుల కిం రా దియ్యఁగ సత్యంబుగ ॥శ్రీకరముగ॥

రక్షోవరహరణా! నారాయణకవిశరణా! మోక్షగుండ పుర వల్లభ, మోహించిరి ముదితలు నిను ॥శ్రీకరముగ॥

తోహ: వీరికోరికలు దీఱిచి బ్రోవుము; వీరికి భర్తవు నీవు; వీరు భార్యలిక వెలయంగ నీకును వేడుగఁ జూడక బ్రోవు ॥రా॥

వ. అని పలికిన మేనమామల వాక్యంబులు విశ్వసించి తండ్రి యుండిన సభకుఁ జని నమస్కరించి రాముం డిట్లనుచున్నాఁడు.

రాము-కీర్తన-రూపకము.

జనక, నామనవి వినుము! మేనమామ లెనముండు సుగుణీరే యేతెంచినారు; ఘనముగ తాముగన్నకన్యల నూటయుమన వేనిమిది మందిన్ వెనుకఁ గొనుచుఁ గైకొను మనుచుఁ॥ జనక॥

ఆముద్దుబిడ్డల రామార్పణముగ, దాము గన్నారట! తలఁగిపోరట! ఆమోహనాంగుల నన్యుల కీరట! యామాటలకుఁ దలఁపఁ ఏమనియందుఁ ముందుఁ॥ జనక నామనవి॥

ధరను మోక్షగుండ ధామునిసాక్షినఁ వరియించి కన్యలు వచ్చిరినేడు; పరిణయ మగుదునో! మరలి పోవ్వుందునో! పరమోపాయం బొందున్ సరగఁ దెలుపఁ వలయుఁ జనక నామనవి॥

వ. అని రామచంద్రుం డడిగినఁ దండ్రి యిట్లనియె:

గీ. అగ్నిసాక్షిగ మొదట పెండ్లాడినట్టి
సీత నెమ్మది యొప్పినఁ జెట్టబట్టు;
లేనిచో మానియుండుము; మేనమామ
బిడ్డలైనను ధర్మంబు విడువఁ దగునె!

అని వచించిన తండ్రివాక్యంబున కలరి రాముండు సీతాదేవి యున్న దెస కభిముఖుండై యయ్యోక్తుల నిట్లనియె:

సీతతోఁగూడ నూటయిరువది తొమ్మిదిమంది భార్యలతోఁగలసి యేక పత్నీవ్రతుం డను ప్రతీతితో రాముండు వెలసె అంత—

సం. తో: అగ్రిభార్య యగు నవనీజయుఁజెలు లందఱు వెంబడి రాఁగా, స్వగృహమునకును జని తల్లులకును సరగున ప్రమొక్కి-రి వేగ॥ రామ॥

సం - వ. వా రానందంబునొంది వారిని లేవఁదీసి అక్కునఁ జేర్చి యాశీర్వదించిరి. అంత—

సం - కం. శ్రీరాముఁడయోధ్యను సీ
తారామయుతంబుగా ముదంబున నత్య
శ్రీరంజిల నై భోగము
లారాఘిని బొందుచుండె నతివేడుకతోన్.

సీ. కన నెల్లెడల నల్లగను నల్లుకొనిన మ
బ్బులు డుల్లి దెసలెల్లఁ దెలుపునొంద,
జలజాకరతటాకములు వాక లెడలేక,
జలపూర్తినొంది ముచ్చటగ దోఁప,
ఘనపంకములు డొంకలను నింక నకలంక
గతి జంతుతతికి సంకటము వాయ,
జను లెంతయును సంతసము నొందఁ ఫలవంత
ముగ నంతటను సస్యములు సెలంగ

గీ. నవనిజయకాంక్షతో రాజు లలరుచుండ,
ధవళకిరణములను సుధాధాముఁ డొప్ప,
నరులు దైవోత్సవముల యత్నములు సేయఁ,
బొడమె శరదాగమంబు సంపూర్ణముగను.

సం-వ. అట్టిసమయంబున దీపావళ్యుత్సవంబు నెఱవేర్ప నుద్య మించి మిథిలాపురిలో జనకచక్రవర్తి తనమంత్రులఁగాంచి,

జనక.తో: రాముఁడు మొదలగు జామాతల సీతాముఖులగు హితలను, భామాయుతముగ బరువడి దశరథ భూమీశుని మం ంలను॥ రామ॥

వ. దీపావళిపండుగకు మననగరంబునకుఁ బిలుచుకొని రావల దని చెప్పిన వారు గదిలి యయోధ్యకుఁ గొన్ని దినంబులకుఁ జేరి దశ సనిచే సమ్మానింప బడి,

మంత్రులు-కీర్తన-ఆదితాళము. (పోవెపోస్వలంకరింపఁగా) వలె.

ధారుణీశ, చిత్తగింపుమా! జనకుండు పంపెను॥ ధారు॥ మీరా , గోరెఁ మారాజేంద్రుఁడు॥ ధారు॥ దారలు, గోడంద్రు, దన లుఁ జెలికాండ్రు, పౌరులు బంధుగులు, మీరు రాఁదగు॥ ధారు॥ ౯క్షుపుర పతికృపను మిథిలకుఁ దగఁ బోవుదము ప్రయాణం ండు॥ ధారు॥

సం-వ. ఇట్లు జనకుని సచివులు దెలిపిన, దశరథక్ష్మాపతి యా నభరితుండయి భటులను గనుఁగొని,

దశ-సీ. దీపావళికి మిథిలా నగరమునకు మమ్ము
		రమ్మని జనకధరావిభుండు
	పుత్తెంచెఁ గాన మత్పుత్రులు స్నుషలును
		కాంతలు హితులు ప్రధానులాత్మ
	బంధువు లాశ్రితుల్ పౌరులు మఱిజాన
		పదులును జతురంగబలము వారు,
	దగ ప్రయాణంబులై తఱలి రావలెనని
		చాటింపు మాతట సకలవాద్య,

గీ. నృత్తగీతము లలరార నేడు వార
	కామినులు వందిమాగధ గణము లెల్ల

సిద్ధముగనుండు నట్లాజ్ఞ సేయుఁ డఖిల
యానము లలంకరింపుడు హర్ష మెసఁగ.

సం-వ. తదాజ్ఞాప్రకారము సర్వము సిద్ధమయిన సంతసించి.

కీర్తన-కాంభోజి: రూపకము-(శరవణామృత)వలె.

మిథిలాపురమున కేగెను, మిత్రకులుఁడు రథముమీఁద నెక్కి-యధికవిభవ మలరారఁగ॥ మిథిలా॥ రామాదికుమారులెల్ల సామజముల బేర్మిమీఁఱ నెక్కి ప్రియమున దన వెనుక నడవ॥ మిథిలా॥ మల్లన సీతాది యువతులెల్ల వెంబడి బల్లకీలలోన నుల్లము లలరఁగ వెడలఁగ ॥ మిథిలా॥ కౌసల్యాదులు పౌరులు డాసి, నడచ వాసి మోతుకుండ వాసుని సన్నుతి సేయుచు॥ మిథిలాపుర॥

సం-వ. ఇటుల చటుల విభవంబున శుభంబున బయలుదేఱి కొన్నిదినంబులకు మిథిలఁ బ్రవేశించినఁ, దద్వార్త విని,—

చ. ఘనుఁడు విదేహరాజెదురుగాఁ జని యందఱ గౌరవించి సా
యని యనురక్తిఁ బౌరులు రయంబున సేసలు జల్ల, నారకా
మినులు నటింపఁ, గాయకులు మేలుగఁ బాడ, సువాద్యఘోషముల్
దనరఁగ, స్వీయధామము ముదంబున జేర్చెఁ బ్రసన్నచిత్తుఁడై.

వ. పిమ్మట వారిని మృష్టాన్నపానంబుల సంతుష్టి నొందించి దీపావళి దివసంబున—

తో: కూతుండ్రకు జామాతల కమితఖ్యాతిని దల లంటించి, ప్రీతిగ నలుగులు బెట్టించి శుభస్నాతుల నటుగావించి॥ రా॥ అతులాంబర దివ్యాభరణాలంకృతు లగునటు చేయించి, చతురంగంబుల సద్దాసీ దాసచయంబుల నర్పించి॥ రాను॥

సం-వ. దశరథుని దత్కాంతలను దక్క-సబాంధవులను బహువిధ సత్కారంబుల దనిపి దీపావళ్యుత్సవంబు సేయించిన, సానందభరితులై దశరథాదులు—

వాహినులఁ వెలదులను నేమఁటకు ॥పట్టుగ॥ మోక్షపురీశుసాక్షిగను దీక్షగను దెలిపెదను ॥పట్టుగ॥

వ. తండ్రికి బ్రణతుండయి యనుజ్ఞవడసి శస్త్రాస్త్రసన్నద్ధుండై యున్న తండ్రియరదం బెక్కి- లక్ష్మణయుతంబుగఁ గదలినఁ గని,

సం-కం. భరతుడు శత్రుఘ్నుండును
పరువడిఁ బదివేలరాజ భటులను వెంటన్
శరకోదండంబులుగొని
నరపాలురతోడఁ బోర నడచిరి బలిమిన్.

సం. వ. ఇట్లు శత్రురాజుల సభ ముఖంబుగ నడచి దిగ్గజంబులు బ్రమ్రొగ్గ, ధనుష్టంకారం బొనర్చినఁ బగతురను వెనుదీయక యెదిరించి,-

రాజుల - కీర్తన - ఆదితాళము. (రామనీదయ) వలె.

నేడు మమ్మెదిరించి పోరుము శ్రీరామచూతము॥ నే॥ యీతడు జనకుని వీడునందల్లనాడు ద్విజరాజ చూడుము! ధనువుఁ ద్రుంచి, యీతడు రాజుల కెల్ల సిగ్గొనగూడఁ బెండ్లి యాడి సీతఁ దోడుకొని చనితి నపుడు॥ నేడు॥ దానమౌకవమాన మాయెను; గాన నాలము లోన గరకుటమ్ములూని కడువడిమేన నైతును; మానసములోన సభిమాన సంయుతుడ నైన ॥నేడు॥ అండనై మోక్షగుండపేర్పుఁ డఖండ మగు దయ నిండఁ గనుచు నుండ, ఖండశశిధరచండకోదండఖండనోద్దండ సమర్థుండనై । యలరి తపుడు ॥నేడు॥

వ. అని తృణప్రాయంబునఁ బలికిన రాముని సైన్యంబులు మూఁగి, భటులు:—

ఉ. బుద్ధివిహీనులార ! బలముం దలపోయక రామమూర్తితో
యుద్ధముసేయవచ్చితి రహో శలభంబులు వహ్ని సేరి స
ల్బుద్ధతి మేము సిద్ధముగ నుండఁగ రాఘవుఁడేల మిమ్ము దే !
యిద్ధరఁగూలనేతు మిపుడింటను గెల్చియు; నచ్చ గెల్వఁడే!

సం-వ. పరశుకుంత భిండివాలాది సాధనంబులు వచ్చుచున్నవి. దప్పించుకొని పొండని వైచి భటు లార్భటించిన, వాని లక్ష్యంబు సేక యక్షయమహాక్షేక్షణంబుల వీక్షించి యక్షమాధ్యక్షులు.

భుజంగప్రయాతము.

ధనుర్జ్యానినాదం బుదగ్రంబుగా జే
సి, నారాచముల్ పూన్చి, చేబల్మిఁ ద్రేయం
గ, నాబంటు లందుండఁగా లేక దూరం
బున న్నిల్చి రామీఁదభూమీశు లెల్లన్—

వ. సింహనాదంబులు సేయుచు రాముని కభిముఖులైన భరత శత్రుఘ్న లక్ష్మణు లడ్డగించి,

భరతాదులు:—

సీ. తాటకాదుల నిరాఘాటంబుగాఁ దోలి
యాగంబుఁ గాచిన యది యెఱింగి,
పాషాణరూపమై పడిన యహల్యకు
శాపంబు వాపిన జాడ యెఱిగి,
మీ కసాధ్యంబైన శ్రీకంఠు చాపంబు
వేయెత్తి విఱిచిన విధ మెఱింగి,
పుడమి నరాజకముగ నొనర్చిన భృగు
రాము గెల్చిన పరాక్రమ మెఱింగి

గీ. రాము నెదిరింప వచ్చితి రా! యిదేమి!
యెదిరి బలమును స్వబలము నెఱుఁగలేని
మందమతులైన మిమ్ము నే మందు మింక!
మమ్ము గెలిచిన తదనంత రమ్ము పొందు

వ. మాబాణంబులు రాకముందు ప్రాణంబులు గాపాడుకొనుఁ డిక్కిలి యుక్కుగల పెక్కమ్ము లెక్కుపెట్టి చుక్కలు రాలినట్లు సుక్కన నక్కల దిక్కు లక్షించి వైచిన, వా రలిగి,

తో. బహువిధశరములు వఱపి తత్క్షణము భరతుని మూర్ఛిల జేసి, సహజన్ముల లక్ష్మణ శత్రుఘ్నుల సరకుఁ గొనక వెనుడాసి॥ రామ॥ అమితబాణ వర్షముల ముంప, వా రంత మోర్వఁగాలేక, వివుఖులైనఁ గని విక్రమమున రఘువీరు జేరి వెనుదాక॥ రామ॥

రాము-కీర్తన-ఆదితాళము. (సరే సరే) వలె.

బలాబలంబులు దలంప కిటు నను గలంపవత్తువురా! రణకౌశలంబుఁ జూపెదరా! ॥ బల॥ అజాబు లాదిగ్గజంబులను గెల్వఁ జాలునే వినుడీ! దీని నిజంబుగను గొనుడీ ॥బలా॥ దురంత మగు మీ పరాక్రమంబుల తెఱం గెఱిగియుంటి! మిథిలాపురంబులోఁ గంటి ॥బలా॥ ప్రగల్భములు పల్కగా నేల మోతుకుండపతియాన నిలువఁగఁ దగుదు రణములోన ॥బలా॥

వ. వర్షధారలంబోలి వెడలెడు మద్బాణపరంపరల కోర్చినఁ జాలు నని పలికి, కౌసల్యాది కాంతలు స్మితాసహింతబుగఁ దనయుద్ధనైపుణ్యంబు జాలరంధ్రంబుల నుపలక్షించుచుండ దశరథుం డచ్చెరువందె,

శా. వాయవ్యాస్త్రము వింట నెక్కిడి కడుఁ వైళంబ బింకంబుగా
ద్రేయన్ వార్థితటంబునన్ బడగ, వారిన్ గొందఱన్ ద్రోసి; నా
చాయ న్నిల్చిన వారిగర్వముడుగన్ సమ్మోహనాస్త్రంబుపై
డాయం జేయ, వితాకులైపడిరి చేష్టల్ దక్కి భూనాయకుల్.

వ. రాముండు ప్రియజనకుఁ జేరి నమస్కరించి సోదరుల యవస్థనుగుఱించి విచారింపఁ బోవునంతలో, నైక,—

ఆ. సమరతలమునందు సాయకములఁబడి
మూర్ఛ మునిఁగియున్న ముద్దుకొమరు
శిరము స్వాంకతలము జేర్చి యత్యంత దుః
ఖాబ్ధి లోన గూలి యడలుచుండె.

కైక-కీర్తన-ముఖారి: రూపకము (హా ప్రాణనాయక) వలె.

నాకూర్మినందనా! నను నిటు దేరి చూడరా! కైక నేర మేమి
! నీకరణిని శోకాబ్ధిని వేఁగూల్చిరి భూకాంతులు॥ నా॥ పలువురు
సూరు లుండి, కలనను నిడుములఁ బడుచోఁ దలగింపఁగఁ దలపరైరి
॥ మనుకులమున జనియించిన నిను బగతురు చెనకెడుచో, జన
కునుగను చుండెను ॥నా॥ జగతిని శ్రీమోక్షగుండనగ శేషుఁడు
రద్దుపడగ జాలక ఏగ ద్రోసెను ॥నా॥

వ. ఇట్లు దుఃఖింప దశరథ-కౌసల్యాదులు సేరి యూరార్పు
చిరి. అంతట, రాముఁడు లక్ష్మణునిజూచి,—

మ. అనుజా! ముద్గలమౌని యాశ్రమము దాపైయుండు నిచ్చోటి, కా
యన దివ్యౌషధవల్లికల్ పెనిచె; నీ వందేగి నాయాజ్ఞఁ దె
ల్పిన సంజీవని నిచ్చు దాన సుఖియై లేచుం దగం గైకజుం;
డను మాసంపకపొమ్ము కార్యవిఫలం బౌ జాగు గావించినన్.

వ. రథారోహణంబుసేసి పొమ్మనఁ దత్క్షణంబ లక్ష్మణుండు
జ్ఞ శిరసావహించి ముద్గలాశ్రమంబుఁ బ్రవేశించి తదీయశిష్యులం
—

సంవాద సీసము:

లక్ష్మ - వటులార యెందున్నవారు మీ గురువులు?
వటులు - యోగసమాధియం దున్నవారు.
లక్ష్మ - మా కార్యములు దీర్చు మాన్యు లిం దెవ్వరు ?
వటు - కార్యంబు లెవ్వి చక్కఁగఁ దెలుపుము?
లక్ష్మ - సంజీవకరణికై చనుదెంచినారము;
వటు - దాని మీ కీ నుచితంబు గాదు;
లక్ష్మ - రామాజ్ఞ! లక్ష్మణ నాముఁడ వచ్చితి;
వటు - నెవ్వరైన నేమి? మే మియ్యగాదు.

గీ. లక్ష్మ - ఎప్పు డవి మాకు దొరకునో చెప్పరయ్య !
వటు - ముద్గలార్యుని నడిగి కొం పోగదయ్య!
లక్ష్మ - తడవు జరిగినఁ గార్యంబు చెడును గాదె !
వటు - యందఱకు నిచ్చుటకు గురునాజ్ఞ లేదు.

వ. అంతట నిష్ఫలుండై వేగంబున రాముని కడ కరిగి,—

మత్తకోకిల.

మౌనివర్యుఁడు నిర్వికల్పసమాధి నుండెను శిష్యులుం
తేని నన్ను నిరాకరించిరి దేశికాజ్ఞకుబద్ధులై;
నే నిజస్థితిఁ దెల్పి కార్యము నెమ్మనైై నెఱవేఱఁగా
వైనముల్ దెలియంగ వచ్చితి; భావిమార్గము జూపవే!

రా. వ. తడవు జరిగిన భరతున కపాయంబు వాటిల్లు.

లక్ష్మణ-దేవర వారి యాజ్ఞ ననుసరించి చేయ సిద్ధము గా నున్నాను.

రా-బ్రహ్మచారుల ధిక్కరించి యౌషధలతల దేనోపుదువు !

ల-ఋషివర్యునకలుక వొడమిన మనకు ముప్పు సంభవించును.

రా-ఈకార్య మనుకూలమయిన పిదప వారికోపశాంతిఁ నేఁ జేయుదుఁగదా !

ల- చిత్తము వెళ్ళుచున్నాను.

చ. చటులజవంబుతో నరిగి సంయమి యోగసమాధినుంట సం
తటఁ బరికించి యౌషధలతల్ గొన నడ్డము వచ్చినట్టి యు
వ్వటుల నిరాకరించి బలవంతముగా నవి సంగ్రహించి, పి
మ్మట నరదంబునన్ జని గ్రసుంబున నర్పణ చేసె [illegible] మొక్కి-సన్ .

వ రాముడు పరమానందభరితుఁడయి అమ్మందు ప్రయోగించి నఁ దత్ప్రభావంబున భరతుండు సుప్తినింబోలి మేల్కని తలిదండ్రు లకు రామునకుఁ బ్రణమిల్లె. వారు దీవించిరి. [illegible] పరమసంతోషిత

నిరపరాధులము మానిలయంబులకువచ్చి
గొఱియఁ దోఁడేలు బొదివినట్లు,
గీ. రేపుచుండుదు రిదివిపరీత మనక
తపము సాత్త్వికవృత్తి వ్యర్థంబుగాఁగ!
మూలనుండిన వారిని ముంగిళులకు
దీయ న్యాయమె యీభూమినాయకులకు!

ముని-వాని నామధేయం బెఱుంగుదురా?

వటు-ఇదివర కెఱుఁగము. లక్ష్మణుం డని వచించె.

ముని- క్రోధతామ్రాక్షుండై ఎక్కడి లక్ష్మణుఁడు! మన వన మెక్కడ! నతం డెం దుండువాఁడు! అక్రమప్రవేశ మేలచేసె! మదీయ కోపానలజ్వాలలు ప్రజ్వరిల్లిన నతఁడు భరింపఁగలఁడే!

వటు-రామునిసోదరుం డనని మాతోఁ బలికె. రాముఁ డెవ్వఁడో!

ముని-ఏమీ! రామునిసోదరుఁడా? (అని యోజించి దివ్యదృష్టితోఁ గని,

చ. దశరథరాజనందనుఁ డుదారయశోనిధి రామచంద్రుఁడా
కుశికతనూజతో మిథిలకుం జని తత్పురమందు నున్న యా
పశుపతివిల్లుఁ ద్రుంచి శుభంబుగ సీతనుగొన్న యట్టి నే
విశదముగాఁగ వింటి మును వీరవరుం డతఁడే యితండగున్.

వ. అయిన మాన మతనిఁ దర్శించి రాఁ దగును-అని శాంతంబు వహించి ప్రయాణంబగుమం దిక్కడ దశరథుండు విషాదంబున సతీ సుతాదుల నవలోకించి,

దశ. కీర్తన—ఆనందభైరవి: రూపకము (ఓ మహాత్మా) వలె.

ఏమిసేతు నేయుపాయము నాకేది తోఁప ॥ప॥

ఆమునీంద్రునాజ్ఞఁగొనక నౌషధములు దెచ్చిరంట! తామసించి శాపమిడక సామాన్యముగాఁ గనునే! ॥ఏమి॥

మానులవిశ్వాసమునకు భూనాథులుపాత్రు లగుదు; రీనాఁడది
ద వ్వాయెను; ఈ నేరం బెట్లు వాయు! నేమి॥ మోక్షగుండవిభుభక్తుల
క్షితి సత్కారంబును బక్షపాతమునఁజేయఁగ నాక్షేపింపరే లోకు!
॥లేమి॥

దశ-వ. ఇదిగాక యతనియనుమతంబు నడయక తెచ్చిరి. ఆఘనుండు సమాధిచాలింపక యున్నపోయి క్షమాపణ వేడుకొనియెద నని యందఱతోఁ గలసి మునియాశ్రమంబున కరిగె. ఆమునియు నెఱిఁగి ఎదురుజని,

ముని—

కం. క్షితినాథ, సతీ-సుత-భట
హితయుతముగ వచ్చినారు హృత్తోషము స్వా
గతమొనఁగెద; నీదినమున
నతిథులరై నిలువవలయు నాశ్రమమందున్.

వ. ఇది మదీయేప్సితం బని యాసదృశకుసుమసమన్విత వృక్షలతాసముదయంబులపొంత నాసీను లగుటకు వసతులుగల్పింప, అందు వసించి దశరథుండు విన్నదనంబున—

దశ- మునీంద్రా! భవత్పాదారవిందంబుల కనేక వందనంబులు.
ము-దిగ్విజయోస్తు! పుత్రపౌత్రాభివృద్ధిరస్తు!

సంవాద-సీసము.

ద-అపకారమొనరించి రయ్యా! నా నందను;
లలుగక కృపఁజూడ వలయు నేడు;
ము- అపకార మేమి చేయఁగలేదు భూనాథ
హితము చేసిరి యుపకృతియ తలఁచి
ద-ఔషధలతలు మీయాజ్ఞఁ గైకొనక స్వ
తంత్రించి తెచ్చుట తప్పుగాదె!

ము-రాముండు సుగుణాభిరాముండు సర్వలో
క స్వతంత్రుండగుఁ గాదె భూప
ద-తే. కోపగించితిరో యని తాప మంది
శాంతి పఱుపంగ వచ్చితి సంయమీంద్ర!
ము-మనుజరూపము దాల్చిన మాధవుండు;
రాముఁడాతని మాకోప మేమిసేయు.

సం - వ. అంతఁ గౌసల్యాదికాంతలు, సీతాదిస్నుషలు, రామాది కుమారులు వేర్వేఱ సుమతీ-ముద్గలులకుఁ బ్రణామనంక లాచరించి వారి దీవన లంది, పిమ్మట వారి యాతిథ్యం బంగీరించి యాదినమందుండిరి. అప్పుడు—

దశ-

కం. మునివర్య! యొక్క-విషయము
వినఁగోరితి మిమ్మునుండి విశ్రాంతినొందుఁడా'
అనవుఁడు, తులసీఖండం
బునకును గొనిపోయి వివరముగ నడుగుమనన్,

దశ-తో. తమ రెఱుఁగనివిషయము లుండవు; నా కొమరుఁడైన రామునకుఁ గ్రముముస రాఁగల కాలశుభాశుభగతు లెఱిఁగింపుడు నాకు॥

సం - వ. ముద్గలుఁ డానందకందళితహృదయారవిందుండై,-

ము - కీర్తన-హిం, కాఫి : ఆది (మొక్క-దన) వరె.

చెప్పెద న్వినుభూధవా! ఇప్పుడు చేసిన ప్రశ్న కొప్ప బ్రత్యుత్తరము॥ చెప్పెదన్॥ శ్రీరాముఁ డనఁగ నాదినారాయణుఁ డుద్భవించె ధారుణీశ! నీదుపుణ్యకారణమునకు ॥నీకు॥ జెప్పినష్టమైనధర్మమునుసృష్టి పైఁగ్రిమ్మఱ నిలుపు, దుష్టులను శిక్షించుచు శిష్టులను రక్షించుఁ ॥చె॥ శ్రీమానినియంశమైన సీతనుజాయఁగ గొని భూమిని శ్రీమోతు గుండ రాముఁడై రంజిల్లును ॥చెప్పెద॥

ముద్గలుఁడు-

కొలఁదికాలంబునకును నీవు దివి కేగ
గలవు వృందాశాపకారణమున;
రాముఁడు దండకారణ్యంబునకు జని
యవల నయోధ్యకు నరుగుదెంచి
రాజ్యంబుగైకొని పూజ్యంబుగా నేలు
లీల బదునొకండు వేలయేండ్లు
కొడుకు లిద్దఱు మఱి కోడండ్రు నల్వురు
మనుమ లిర్వదినాల్గుమంది మనుమ
రాండ్రు పండ్రెండుగురు ప్రపౌత్రాళి యగణి
తంబుగా నిట్లు సూర్యవంశంబు నెంచి
దీవులేడింటఁ దాన సాధించి యేలఁ
గలఁడు నీయగ్రసుతుఁ డొక కాలమందు.

వ. ఇదియ నీకొడుకు భావికాలవర్తమాన మనిన,

దశ-తో. వృంద యనఁగ నెవ రెందుండును నాసుందరి విభుఁడె వ్వఁడు? ముందు శాప మా యిందిరాపతికి నెందు కొసఁగె నది ||రా||

వ. ఆకథావిధానంబు కరుణారసపరిపూరిత హృదయుండవై యాలింపు డన ముద్గలుండు——

ము. నాట-రూపకము, (జనకా) వలె.

వినుము భూమిపా మునుపు శంకరుని ఘనకోపవహ్ని వన ధిఁబడిన జయించె నందులో జలంధరాసురుఁ, డనఁగన్; వరుణుఁ డ తని ననురాగమునం బెనిచెన్॥ విను॥ జాలంధర మనుపోలు నగరి చాలఁగ నందు లీలవసించి, కాలనేమిగన్న కన్యను వృంద బాలన్ సద్గుణజాలన్ ఆలింగాఁ దాఁ గైకొనె॥ విను॥ దండి

వీరుఁ డనఁ దనరి వేలుపుల దండించి తొలిదర్పముదూల, నుండ తావు లేక బెండువడి మోక్షగుండనగరవిభుని యండ జేరి తెల్పిరి॥ విను॥

వ. ఇటువలెఁ దనశరణుసొచ్చిన దేవతల నాదరించి విరించి జనకుఁడు:—

విష్ణు-క. పురహరుఁడు దక్క నోరు లె
వ్వరు వాని జయింపలేరు వాస్తవమాశం
కరునారాధింపుండా!
తఱిగని నేఁ దోడుపడుదు; దైత్యుఁడు మడియున్.

వ. అంతదేవతలు:—

శివప్రార్థన—దేశిలావణి.

పురవైరీ! పురవైరీ! పురవైరీ! పురవైరి! విధృతవనజారి! వినుతఘనసూరినిచయ! కరివైరీ! కరివైరియానవర, శౌరి! మాత్రహర భూరిభయద నరకారీ! నరకారివినుత పద వారిజాత! స్మరవైరి! హర! గరుడారి! గరుడారితల్పశరధారి! విమతపరిహారి! లోక హితకారీ! ॥1॥ శ్రీమోక్షగుండధామాక్షదామ! ప్రతిపక్షద్విరదహర్యక్షా! హర్యక్షవక్త్రిబుభుక్షాక్షుశూరఘనరాక్షసప్రకరశిక్షా! కరశిక్షోపరిరక్షితరావణ యక్షరాజసంరక్షా సంరక్షిత మునినుత! దక్షాధ్వర సర్వక్షయదివ్యకటాక్ష॥ 2॥

వ॥ ఇక్కరణిఁ బెక్కుగతుల నగ్గించిన ముక్కంటి దేవతలదిక్కు వీక్షించి ప్రసన్నుం డయిన, మ్రొక్కులొసఁగి,—

దేవతలు,—

ఉ. దేవ, జలంధరాసురుఁ డుదీర్ణబలంబున మమ్మదిర్చి మా
తావులు దానగైకొనియెఁ; దాళఁగఁజాలము వాని ధాటికిన్!
యేవిధి నింక వానిసమయించి దయార్ద్రుల మమ్ముఁ బ్రోవఁగా
నీ వసమర్థుఁడౌదు వన, నిం బరు లోపరు చంద్రశేఖరా॥

దే-వ. మాకు శరణ్యుండవుగావే యని యని ప్రార్థించిన, వారి కభయంబిచ్చి వాని యుద్వేగం బడంప నిశ్చయించి,

సం-తో. శూలము గైకొని జాలంధరు నిలఁ గూలుపఁ జనుచుం డఁగను వేలుపులను దావెదకుచు నెనురుగ వేగ వచ్చె నాతండును॥ రా॥

సం-వ. ఇట్లిరువు రొకచోఁ దారసిల్లి పో రొనర్చుచుండిరి. అప్పుడు——

సం-క. శీతాద్రిజాత ప్రేరణ
చేతరమా నేతఁ దనదు చేతమునంద
త్యాతుర మొందుచు వృందా
పాతివ్రత్యంబు సెరుప బరువడి నరిగెన్.

సం-వ. జాలంధరపురోద్యాన వనంబున నొక శిష్యునితోఁ బ్రవేశించి యొకచో నాసీనుండై తపంబు సేయుచుండె.

తే॥ వృంద నిజభర్తృ పాదారవిందములను
డెందమున గొల్చి యొకనిశియందుఁ దనదు
మందిరంబునఁ బూవాన్పునందు నిదుర
జెంది కలఁ గని లేచి లోఁగుంది కండి.

వృంద-పాట-ఆది (వలదచటికి) వలె.

కల గనినానే! చెలియ! వినుము తెలియుగ ॥కల॥ చెలువుఁడ నూనె దలయంటుకొని, వలువ దాలుపకయ యున్నటులను ॥కల॥ ముండియై మహిషమును నెక్కి నిశిని దండధరునిదిశకు దరలినటుల॥కల॥ మోక్షగుండేశుని యక్షయకారుణ్యవీక్షణ కలదో! లేదో! తెలియరాదు ॥కల॥

వృంద- సీ. పలువేలుపుల డీలుపడిపాటుఁ గాదోలు
నలకాలుపస ప్రేలునటుల జేయు;

దగఁ బాసి దెసఁ డాసిఁ తనవాసిఁ గనఁజేసి
మఱి యక్షవరుశిక్ష పఱిచి పసుపు
సిరిబిడ్డ గనబడ్డఁ జిలుగడ్డమునులాఁగు
బలుమాటలు జడదారు లలయ దూరు
బనిమాలి వనమాలిఁ గని గేలిసేయును
గుఱిమీఱ హరుబోరఁ గోరుచుండు

గీ. నెంతదెల్పిన విన డిసుమంతయైన
నిపుడు త్రిపురారి పైకేగ నిపుణుఁ డగుచు
యుద్ధ మగుచున్న దచట మహోగ్రగతులఁ
జెడ్డకలఁగంటి నే నేమి సేయుదాన!

వ. ఈసంతాపంబు కొంత యుపశాంతించుటకు వనాంతరంబున విహారింత మని పలికి, తెల్లవారినపిదప నిరువురు చెలికత్తెలతోఁ గలసి యుద్యానవనంబు సేరి విహరింపుచు ప్రాణనాథుని దలంచి వగపు గలుగ:—

బృంద-కీర్తన-హిం-తోడి: రూపకము-(వరధాత్రీతనయా) వలె.

తరుణీ! నావిభుఁడు తడయుటకు గతంబదేమో॥ తరు॥ పురహరుతో బోరుసలుపఁ దర మగునటె తనబోఁటికి! తరు॥ అశుభసూచకములు దోఁపనాయె నేఁడుఁ నా కిఁక విశదంబుగ క్షేమవార్త విను పించెడువారు లేరు॥ తరు॥ ధరణిని శ్రీమోక్షగుండధాముఁడయిన శ్రీహరి హరు లజేయు లనుచును బలుమఱుఁ దెలిపిన విన డాయెను ॥ తరుణీ॥

వ. ఇట్లు విలపించుచున్న:—

చెలులు- క. కల కేమి! కనులు మూసినఁ
బలువిధములఁ దోచు చుండుఁ బ్రతిదినమును నా;

వ॥ భయవసధిని మునింగితి ! ఘనముగ నాశకగతి॥
ముందాపదనొంది, వగఁజెంది వనమందుఁ జేరి యుండ నాన
దోడింప దొకకీడొంద నాయె॥ ము॥ తాపసేంద్ర ! నేనా
ళ్రీపతిబోలి యిపుడీపాపుల కోపాగ్నిని రూపార్పుము!
॥ మునివర॥ [ఇంతలో]

తో. పటుభయంకరార్భటులతోడ నచ్చటికిరకసు
నటుఁగని తటుకున నమ్ముని హు మ్మన నవ్వల కేగిరి వేగా

వ. అమ్మహనీయుని ప్రభావంబునకు నాశ్చర్యసా
ష్టాంగనమస్కారం బొనర్చి వృందాదేవి—

వృంద. సీ. భవదీయహుంకార పటురవస్ఫూర్తిచే
మత్ప్రతిపక్షులు మాయమైరి;
మీదయారసము నామీఁద వర్షించిన,
సకలభయాగ్నులు సమసిపోయె,
మీ రెఱుంగని దెద్ది మేదినిలో లేదు
మహనీయులరు మీరు మౌనితిలక,
యడిగెద మి మ్మొకయంశంబుదానియ
ర్థాంబు దెల్పఁగా నగును దేవ.

గీ. నాదుమగఁడు జలంధరనామ దనుజుఁ
డభవు నెదిరించి యనిసల్ప నరిగినాఁడు;
బహుదినంబులు జరిగె నిప్పటికి రాఁడు
వార్త దెలియక యీగతి వనరుదాన!

వృంద-వ. నాయభీష్టంబు దీర్పుఁ డని ప్రార్థింప, ముని
యూర్ధ్వదృష్టితో నవలోకించె. రెండుకోఁతులు వియన్మార్గమున
క్రిందికి వచ్చె. నమస్కరించె. మౌనికనుసన్నతోఁ దెలిపిన—

క. గగనమున కెగసి రెండుగ
దెగియున్న జలంధరాఖ్య దేహము గొని, వా
ర్మగుడ జనుదెంచి, వృందకు
నగపఱచిరి క్షణములోన నాశ్చర్యముగన్.

వ. భిన్నమైయున్న భర్తృకళేబరంబు గని వృంద మూర్ఛిల్లిన, మునీంద్రుండు కమండలోదకంబు ప్రోక్షింప, మూర్ఛదెలిసి,

వృంద. కీర్తన - నాదనామః (ఆదిఎంతదుర్ది) వలె.

దైవదుర్బలమో! నావ్రాతఫలమో! యీవేళ విగతజీవుఁ డాయెను పతి॥ దైవ॥ ఏకాలమున కేమే లగునో, యేకీ డగునో యెఱుఁగలే మకట! ॥దైవ॥ విజయము నొంది వే వత్తు నని నిజముగ నమ్మి నే నుంటి నయ్యో! ॥దైవ॥ గురుతర మోక్షగుండేశుఁ గెల్వదర మగునే నీకు! దరి యెవ్వ రింక ॥దైవ॥

వ. అప్పుడు మునివర్యుండు సమీపించి,—

ముని:- క. చచ్చినవారలు గ్రమ్మఱ
వచ్చెదరే! శోక మొంద వలదు విబుధులీ,
వచ్చుట బోవుట సమ మని
చెచ్చెర చెప్పుదురుగాదె శీతాంశుముఖీ!

వ. దుఃఖింపవలదు లె మ్మనదెలివినొందిజడదారిపదములఁబడి—

భుజంగప్రయాతము.

వృంద-మునీంద్రా! భవత్పాదముల్ నమ్మితిన్నా
మనోనాయకుం గూల్చె మారారి యల్కన్,
బునర్జీవితుంజేయఁ బూజ్యుండ వీవే!
కన న్వేరొకం డోపఁగా లేఁడు ధాత్రిన్.

పంచచామరము.

ముని- పురారిగొన్నవీనిప్రాణపటుల్ మరల్ప నేఁడు నా
తరంబె! యైన మత్కృపాసుధారసంబు నీపయిన్

గరంబు జిక్కఁ జూడు సీమగం డిదే సజీవుఁడై
కురంగటం జరింప జేతుఁ గూడు మంగనామణీ!

వ. అంతలో జలంధరుండు యథావిధిగ లేచి నిలిచిన వృంద యానందకందళితహృదయయై ముని నభినందించుచుఁ బ్రాణనాథుఁ నాలింగనంబుఁ జేసికొనియె. అది మొదలుగ—

సీ. ఖేలానుకూల విశాలలాలిత మాల
తీలతా నికురంబ కూలములను
సారసకల్హార వారిపూరితదివ్య
చారుసరోవర తీరములను
సంతతసుమఫలసంతాన శోభిత
సంతాపహారతరుప్రాంతములను
మలయానిలాయాతసలలిత సుమరజో
కలితమౌ సైకత స్థలములందు.

గీ. అలజలంధరు రూపుగొన్నట్టిచక్రి
వృంద ముదమందముఖము చుంబించి మోవి
పానకముగ్రోలి చొక్కితిబంధరతుల
గలసిమెలఁగెను దాఁజిరకాల మచట.

వ. ఒకనాఁటి సురతాంతంబున ప్రమాదంబుచే నిజరూపంబున నిదురించుచున్న యతనిం గని వెన్నుం డని గుర్తించి యా యన్నుల మిన్న కన్నుఁగవఁ గెంపు లొలుక—

ర్తన-కన్నడ: ఆదితాళము (రాకేందు) వలె.

నీ మాయ దెలిసె! మనసు సొలసె! మాయఁజేయు నాయ కుగునా ॥ నీమా॥ అపకారబుద్ధివచ్చినట్టి శౌరి వని కంటి! కపట తపము గావించితివి ॥నీ మా॥ పరదారనంటి వెంట నుంట గౌరవం

గా! మేర మీరారి తౌరా ధీరా। ॥నీ మా॥ గురుండు శిష్యుఁడాయె।
ఘగుండవర నీకు దండ నుండఁ దగదు తలఁగు ॥నీమా॥

. జయవిజయులను నీపారిషదులు నాకు
గీడా నర్చిరి రాక్షసాకృతులతోడఁ
బుణ్యశీల సుశీలు రిప్పుడు కపులంబు
నీదు పదను పాచరించిరి నిశ్చయంబ.

. ముం దీవు రాక్షసులచేఁ
బొందుగ నిజసతిని గోలుపోయి మనములోఁ
గుంది కపులుఁ దోడ్పడఁ జే
కొందువు కామినిని మగుడఁ గూరిమితోడన్.

వ. దండకాననవిహారంబు భార్యావియోగంబు కపిసహాయంబు
చనంబునం జేసి నిశ్చయంబుగ నీకు లభింపఁగల దని,

సం- తో: ఇందిరాపతికి నిటు శాపం బిడి వృందవిభుని స్మరి
పొందుగ ననలము గూర్చి తనువు నానందమ్మున నర్పించి॥రా॥
వ. పరలోక సుఖంబున కరిగె-

ముద్గ-పాటః అట-(ఓర్చియుండు మిక) పలె.

రాజ రాజ విను దశరథమహా ॥రాజ॥ ఆ జయవిజయులె
[illegible] రిపుడు ॥రాజ॥ రావణ కుంభకర్ణ నాములైరి మహా
[illegible] లంకయందు వసించిరి ॥రాజ॥ లోకకంటకులై య
[illegible]చిరి ॥రాజ। మోక్షగుం జేశుపైఁ బూనిరి వైరము ॥ రాజ॥

సీ. మానుజేశ నీకొడుకురు గోడలును బంచ
వటియందు నుండ రావణుఁడు వచ్చి
రాముని మరఁ జేసి భూమిజఁ గొనిపోయి
తల్లిరీతిని బ్రోచి తనరుచుండు;

వాలినివధియించి వానితమ్మునిఁ గూడి
కపిసేనచే వార్ధిఁ గట్టఁజేసి,
రావణాదులఁ గూల్చి రమణితోడ నయోధ్య
జేరి తాఁ బట్టాభిషిక్తుఁడగును;
గీ. యజ్ఞము లొనర్చి మఱి తీర్థయాత్రలాచ
రించిద్వీపంబులేడు సాధించి యేలు;
నిదియు గోప్యంబు; నీకు నే నఱుకపఱచి
తిని; మహీవర యొరులకుఁ దెలియనీకు.
శివుని- క. ఈరీతిని ముద్గలముని
శ్రీరాముని భావిచరిత చెప్పఁగ విని యో
గౌరీ! దశరథుఁడు నను
సత్కారము లర్పించి పలికెఁ గ్రమ్మఱ మునితోన్.

కీర్తన. శంకరాభరణము: అట (పింగళాయ) తాళ.

సన్మునీంద్ర. సంతసమాయెను ॥సన్మ॥ మన్మనోభీష్టము మాను గఁ దీర్చితి ॥సన్మ॥ రాముఁడు హరియని భూమిజ రమ యని స్వామి తెలిపితిరి ॥స॥ జోడుగ గొడుకుఁ గోడలుగా నను గూడఁగ నేటికి॥స॥ శ్రీకరమోక్షపురీపతికృపతో నా కథఁ దెల్పవె ॥సన్మ॥

వ. నాపూర్వవృత్తాంతము దయాంతఃకరణముతోఁ గొంత సెలవిండని ప్రార్థింప ముద్గలుం డానందభరితుండై.

మ. ధరణీనాయక, సహ్యపర్వతము చెంతన్ బింగళానామకా
గరవీరం బన నొప్పు, నందుఁ గపిలీలన్ ధర్మదత్తాఖ్యభూ,
సురుఁడొక్కండు గలండు: సద్గుణుఁడు సుశ్లోకుండు సద్ధర్ముఁడున్,
హరిసేవాపరతంత్రుఁడై మెలఁగు నిత్యాత్మ సంతుష్టితోన్.

వ. ద్వాదశాక్షరవిద్యాపరాయణుండై భార్యాద్వయముతోఁ గూడి యతిథిపూజ యొనర్చుచునుండు, వాఁ డొకపరి—

తో. భాసుర కార్తికమాసంబున హరివాసరమున గుఱియుంచి
గఁ దా నుపవాసనియతిమై వాసుదేవు నర్చించి॥రామ॥

సం-వ. రాత్రి జాగరణకొఱకు హరిమందిరమునకు నరుగుచుండ
మధ్యంబున—

సీ. వెడఁదశరీరంబు విన్నుమున్నకంటి,
కాటుకకొండతో దీటుగాఁగ,
దీర్ఘనిశ్వాసంబు ఘుర్ఘురస్వనమును,
దెగువ భీమంబుగ దిశలఁ బర్వ,
రక్తలోచనముల రగులుపిస్నికణంబు,
లలప్రళయజ్వాల ననుకరింప,
లంబజిహ్వాగ్రంబు జుంబించు వక్రదం
ష్ట్రిలు వరాహంబులఁ జెలిమిసేయఁ
. గడుదిగంబరమై పైకి గవయు శవక
దేహనొకరక్కసిని గాంచి ద్విజవరుండు
దనువు గంపింప నొక కొంత తడవు భీత
చిత్తుఁడైయందు నిలిచి యోజింపఁ దొడఁగె.

కీర్తన-కదంబరాగము, ఆది(ఇంతపాప మెన్నడైన)వలె

ఏమి యీవికారరూప మిటుల నెదుట దోప, స్వామికేమిలోప
లిపినానో। తలఁప॥ నేమి యీ॥ ఎన్నిసారు లిటు రాలేదు!
డిచటలేదు! చిన్నిరూపుగాదు! పై కొన్న దవలబోదు! ॥యేమి॥
గుండహరిని గొలువఁ బోవుచుండతుటువ రాక్షసిటుల నిలువ,
దిఁకేమి తోఁచిన!॥యేమి॥

వ. ఆపన్నివారణుండగు హరియుండ భయఁపడనేలయని నిశ్చ
వాసుదేవద్వాదశాక్షరి జపించి తులసీదళయుక్తం బగు నుద
దానిపైఁ జల్లిన,—

తో. భాసుర కార్తికమాసంబున హరివాసరమున గుతియుంచి
గఁ దా నుపవాసనియతిమై వాసుదేవు నర్చించి॥రామ॥

సం-వ. రాత్రి జాగరణకొఱకు హరిమందిరమునకు నరుగుచుండ
న్మధ్యంబున—

సీ. వెడఁదశరీరంబు విన్నుమన్నునకంటి,
కాటుకకొండతో దీటుగాఁగ,
దీర్ఘనిశ్వాసంబు ఘుర్ఘురస్వనమును,
దెగువ భీమంబుగ దిశలఁ బర్వ,
రక్తలోచనముల రగులువహ్నికణంబు,
లలప్రళయజ్వాల ననుకరింప,
లంబజిహ్వాగ్రంబు జుంబించు వక్రదం
ష్ట్రిలు వరాహంబులకోఁ జెలిమిసేయఁ

. గడుదిగంబరమై పైకి గవయు శుష్క
దేహనాకరరక్కసిని గాంచి ద్విజవరుండు
దనువు గంపింప నొక కొంత తడవు భీత
చిత్తుఁడైయందు నిలిచి యోజింపఁ దొడఁగె.

కీర్తన-కదంబరాగము, ఆది(ఇంతపాప మెన్నడైన)వలె

ఏమి యీవికారరూప మిటుల నెదుట దోప, స్వామి కేమిలోప
లిపినానొ। తలఁప॥ నేమి యీ॥ ఎన్నిసారు లిటు రాలేదు!
డిచటలేదు! చిన్నిరూపుగాదు! పై కొన్న దవలబోదు! ॥యేమి॥
గుండహరిని గొలువఁ బోవుచుండతులువ రాక్షసిటుల నిలువ,
డిఁకేమి తోఁచె!॥యేమి॥

వ. ఆపన్నివారణుండగు హరియుండ భయంపడనేలయని నిశ్చ
వాసుదేవద్వాదశాక్షరి జపించి తులసీదళయుక్తం బగు నుద
దానిపైఁ జల్లిన,—

సం వా-సీ. భి-చెప్పినరీతిగ జేయు వే మదినీవు?
కల-చెప్పి చేయింప నీచేత నౌనె!
భి-ముందుగాఁ దిని పండుకొందు వదే కొమ్మ!
కల-నీయాజ్ఞ నా మీఁద నెఱపఁగలవె!
భి-దేవపూజయు వైశ్వదేవ మె ట్లగునింక?
కల-వేఱుపాకంబుఁ గావించుకొనుము
భి-నే వండుకొను నెడ నీ వుండ ఫలమేమి ?
కల-నాయింట నుండుట నాకుఁ దగదె!
భి-ఎంత తెగువరి వైతివే యిందువదన!
కల-నీకు లోఁబడుదానసే నిశ్చయముగ!
భి-మారువల్కిన శిక్షింతు మగువ నేఁడు.
కల-కూపమునఁ గూలి ప్రాణంబు గోలుపోనె!

కల-వ. నా నామంబు సార్థకంబగునట్లు వితండము లాడుచుఁ బ్రవర్తించుచుండ నపకీర్తిలోఁబడి యతండు బహుకాలంబు గడపి విసిగి యొకనాఁడు తనప్రియ మిత్రునిం జేరి,—

కీర్తన - ఆదితాళము: (రారాఘభాంగ) వలె.)

విన్నావె మిత్రా యీవేళ నాచరిత్ర ॥విన్నా॥ వినుటకుఁ జిత్ర మీవేళ నాచరిత్ర ॥విన్నా॥ ఇంటిలో పో రహో! యింతింత యఃరాదు! కంటకమాయె! వేగమె! నాచరిత్ర ॥విన్నా॥ చెప్పినరీతిగఁ జేయదు పెండ్లాము! తిప్పలబెట్టు! నీ తీరు నాచరిత్ర ॥విన్నా॥ మోక్షగుండేశునిసాక్షి నాతోఁ బ్రతికక్షగఁ జేయు వేగమె నాచరిత్ర ॥విన్నా॥

వ. ఇహపరసౌఖ్యంబులకు నాలవాలము దార యను కారణంబున నోరిచి యెంతబోధించినను భస్మహవ్యమువలెవ వ్యర్థమగుచున్న యది. దీని కే దైన యుక్తిచెప్పుము సఖా! అని వేడిన—

సఖుఁడు:-క. క్రమముగఁ బని చెప్పిన న
క్రమముగ! దా నాచరించుఁ గావుననీ వ
క్రమముగఁ జెప్పుము తా నది
క్రమముగఁ గావించునదియు గార్యంబు హామ్మా.

వ. ఈయుపాయంబున కచ్చెరువొంది భిక్షుండు వెంటనే గేహము నకువచ్చి యువిద పరీక్షింపఁగోరి,—

దంపతుల వివాదము-మానినీవృత్తము.

భి. మానిని, నాప్రియమిత్రుఁడు ధూర్తుఁడు; మానుగ విందు కుఁ బిల్వకుమా! నేనును నాతనిఁ బిల్వను నాపుఁడు—

కల. నేరవు జ్ఞానవిహీన, ధరణ్ వానిసమానుఁడు లేఁడు; కృతఘ్నుఁడ; వాపరమాప్తుని దూరెదవా! మానుగ నేఁ జనివిందుకుఁ బిల్తుసుమా నలదన్నను మానుదునా!

వ. ఇట్లుపలికి యతనిఁ దోడితెచ్చి మృష్టాన్నతృప్తునిం జేసి పంపితి. అది మొదలు నిషేధోక్తు లాజ్ఞాపించుచు సంసారంబు నెఱవేర్చుకొనుచుండి యొకనాఁడు—

సంవాద-కీర్తన-అటతాళము: (రాము నంపిన) వలె.

భి-ఇద్దినము నాతండ్రిదిది తద్దినము వినగదె! ముద్దుగుమ్మ, నెర వేర్పవద్దు మన మిద్దఱము ॥ఇది॥

కల-అద్దిరా! యిదేమి యబ్బతద్దినము మానుదుర! బుద్ధిలే దూరకుండు! పెద్ద లిది మెచ్చెదర ॥అద్ది॥

భి-మాటికి నే ఁటేటఁ బెట్టనేటికి కిది బోటి! విను, కూటికై పితరు లిచ్చోటి కరుదెంచెదరె ॥ఇద్ది॥

కల-ఏటి కొడుకవునీవు! చేటులకు మూల మిది! సాటివారు వెలివేయరె! టాటోటుమాటలు చాలు॥ అద్ది॥

భి-ఆక్షేపణలేకయుండ దీక్షగ నే నొక్కనికిఁ గుక్షి కింతకూడు బెట్టి యీక్షణమె పంపెదను॥ ఇద్ది॥

కల-మోక్షగుండ శౌరిపదసాక్షిగను శాస్త్రవిధి లక్షింపక యి చ్ఛాగతి నీక్షితిఁ జరించెదవె॥ అద్దిర॥

వ. ఇట్లు భర్తను ధిక్కరించి తత్క్షణమపోయి పదునెనిమిది మంది భోక్తలను నియమించి గృహాదులు శుద్ధిచేసి సమస్తశాక సూప భక్ష్యాన్నములు సిద్ధపఱిచి భోక్తలఁ దోడితెచ్చి శుద్ధాసనాసీనులఁ జేసి యర్చింపు మన.

భిక్షుండు-నాకుశరీరము జబ్బుపడినది. స్నానము మానుదునా ?

కల-ఇంతదురాచారుఁడవా! స్నానముమానిన వృథా శ్రాద్ధముకాదా?

భిక్షు-(స్నానముచేసి వచ్చి యథావిధి నర్చించి)

సంవాదము-ఉత్సాహవృత్తము.

భి- అందఱుఁ భుజించుదనుక నాగలేవు భామినీ
ముందు నారగించి, పిదప భోక్తలకుఁ బెట్టుమా !

కల- మందమతివి ధర్మశాస్త్రమతమునీకుఁ దెలియదా !
ఇందఱిఁ భుజింపఁజేసి యేను బిదప దినియెదన్.

వ. ఇట్లపసవ్యంబుగఁ జెప్పినపనులెల్ల సవ్యంబుగ నాచరించు చుంటి. అప్పుడు బిండప్రదానంబుతోఁ గూడ శ్రాద్ధంబు నెఱవేర్చి—

సంవాదము-మత్తకోకిల.

భి-ఈదినం బుపవాస ముండెద నింతి నే భుజియింపనా! మోద మంది భుజించు మిప్పుడు మూడుజాములు మీఱెనా !

కల-వాదమా ! యిది పైతృకం బుపవాసహేతువు గాదు మర్యాదగన్ దిను మంచుఁ బెట్టితి; నారగించెను నాతఁడున్.

వ. అటుపిమ్మటఁ బ్రమాదంబున—.

